ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వేశ్వరి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కపాలమాలాధారి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ భగవతి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ శ్రీనాథ సోదరి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ లంకాశంకర దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ హరికేశసఖీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ హకారరూపాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ జగదీశ్వరీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ ఆగమ విద్యాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ జ్ఞాన జ్ఞేయదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ వ్యోమకేశ్వరీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ విశ్వమాతాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మాయాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వవ్యాధినివారిణిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ విష్ణు రూపిణిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ గోవిందరూపిణి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మహారుద్రరూపిణి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ పరాబ్రహ్మరూపిణి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ విశ్వధారిణి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ ముక్తి దాతదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కపర్దినీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ త్రైలోక్యమోహ చక్రదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వాశాపరిపూరక చక్రదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వసంక్షోభణ చక్రదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వసౌభాగ్యదాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వరోగహర దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వ సిద్ధిప్రద దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వానందమయి దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మంగళగౌరీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కలికల్మషనాశదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కాత్యాయని
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ షోడశాక్షరీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ వాగధీశ్వరీ
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మలయాచలవాసి దేవి

ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మేరునిలయాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ పాయసాన్నప్రియాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ హరిద్రాన్నైకరసికాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ ముద్గోదనాసక్తచిత్తదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ దధ్యన్నాసక్త దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ గుడాన్న ప్రీత దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ నారాయణిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మహాదేవదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ లోభనాశనిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మోహనాశని దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ 'మద'నాశని దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కామరూపిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ కురుకుళ్లాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ భవనాశిని దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వమంత్ర దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ శాంభవి మృడానీ దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ హాదివిద్యాదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ బిందుమండల దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ చింతామణి వాసిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సర్వసౌభాగ్యలక్ష్మీదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మహాభగమాలిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ పంచబ్రహ్మస్వరూపిదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ దశముద్రదేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ సువాసనర్చనా దేవి
ఓం ఐం హ్రీం శ్రీం - శ్రీ మంఛాది శాయిని

# శ్రీ కనక దుర్గ కాంచన మాలలు

నవరాత్రులు మానవులకిచ్చిన నవరత్నాలు కాలము అమూల్యము తరువాత చేసుకుంటామని మానవ తలపునకు, దైవశక్తిచే తెలియచేయు దినములలో ఆ దివ్యశక్తిని పరాశక్తిని కొలిచితే ప్రతీ జీవికి కావలసినవి, కష్టాలు, అనేక రక రకాలైన ఈతి బాధల మోక్షము సర్వము ఇస్తుంది.

# నవరాత్రి పూజా శక్తులు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | కుమారి - 2 సం॥లు | - | దరిద్ర, దుఃఖనాశని | - | పాయసం |
| 2. | త్రిమూర్తి - 3 సం॥లు | - | ఆయుష్, త్రివర్గ ఫలాలు | - | పాలు |
| 3. | కళ్యాణి - 4 సం॥లు | - | విద్యావినయ వైభవ సంపదలు | - | అరటిపళ్ళు |
| 4. | రోహిణి - 5 సం॥లు | - | రోగనాశము | - | వెన్న |
| 5. | కాళిక - 6 సం॥లు | - | శత్రునాశనము | - | కలకండ |
| 6. | చండిక - 7 సం॥లు | - | సర్వ సంపదలు | - | చక్కెర |
| 7. | శాంభవి - 8 సం॥లు | - | విజయ కార్యసిద్ధి | - | ఆవునెయ్యి |
| 8. | దుర్గ - 9 సం॥లు | - | దుర్ఘటన కార్యసాధన | - | పాయసం |
| 9. | సుభద్ర - 10 సం॥లు | - | సర్వమానవ ఇష్టకోరికలు | - | పాలు |

కేవలం ఇతరుల విమర్శించని నిజ భక్తులకు అడుగకనే వరాలిస్తుంది. సన్మార్గులై దైవ కృపకు పాత్రులై సాధ్యమైనంత వరకు ఇతరులకు "మేలు" చెయ్యకపోయినా, "కీడు" చేయకుంటే చాలు. ఒక మానవకంటి నీరు పెట్టే కఠినమాటలు మాట్లాడితే, చేతలు, మనస్సులో ఎలగైనా బాధపెడితే ఒక రోజుకి పదిరోజులు ఆ మానవదేహము కంటతడి పెట్టి ఏడుస్తూ జీవనం గడుప వలసివస్తుంది.

ఆరుశత్రువులు - కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు ఇంకా అసూయ అకారణంగా ఇతరుల ఉన్నచూచి వారిని బాధించుట సౌందర్యంగాఉన్నా, విద్యావంతులు, ధనవంతు, తపోశక్తుల, ధ్యానశక్తి, నామశక్తి, ఇలా వీరిని మనసులో చేతల్లో మాటల్లో బాధ పెడితే మహా తీవ్రరూపం దాలుస్తుంది దైవశక్తి, నరసింహా, ఆంజనేయ, మహారుద్ర, కాళీ, మహాచండి వీరభద్రుడు, ఇలా అనేక రూపాల్లో శ్రీకృష్ణ, శ్రీ విష్ణు, లక్ష్మి, సరస్వతి, సాత్వికదేవతలు చక్రాదులతో, సరస్వతి వాక్ బంధిస్తుంది.

కేవలం అమ్మవారి భక్తులేకాదు కుమారునిగా కుమారస్వామి ఆరుముఖాలతో, గణేశుడు పంచముఖాలతో, ఆంజనేయుడు పంచవదనాలతో, విష్ణుమూర్తి దశావతారమూర్తియై, రుద్రుడు పదకొండు ముఖాలతో చీల్చి చెండాడకమానరు. అధర్మము ఏదైవశక్తి సహించదు. క్షుద్ర శక్తులు సహకరించినా వానినే, సర్వనాశనం చేస్తుంది. దక్కేది దక్కకమానదు. దక్కనిది ఎంత ప్రయత్నించినా దక్కదు - ఇతరుల చూసి ద్వేషం మానాలి ఎవరికి ఎంతో అంతే।

# శ్రీ కనకదుర్గ కాంచన మాలలు

**కుమారి** : హరిహరబ్రహ్మ శక్తుల సృష్టించేది.

**త్రిమూర్తి** : సర్వదేవతా వ్యాపకత్వము కలుగచేస్తుంది.

**కళ్యాణి** : సర్వ సకల శుభాలు ఇస్తుంది.

**రోహిణి** : సర్వదేవతా శక్తులు వ్యాపింపచేసి మరల జాగ్రత్తపరుస్తుంది.

**చండిక** : వీరశౌర్య రణరంగధీర చండముండాసుర సంహారిణి

**శాంభవి** : అకారణంగా లోకాలు సృష్టిస్తుంది.

**దుర్గ** : మహాదుర్ఘటన కార్యశక్తి మహిషా సుర మర్థిని

**సుభద్ర** : సర్వ శుభపరంపరలు అనుగ్రహిస్తుంది.

సర్వము అమ్మఇస్తుంది. సద్గుణాలు : "సత్య ధర్మ ప్రేమశాంతి దయ దానము క్షమ త్యాగము పరోపకారము కరుణ," సర్వమానవ ఆకారాలుబట్టి, "ధన, బీదబేధాలు, నలుపు తెలుపుల తేడాలు, విద్య, అవిద్య అని పరిహసించక ఒక్క ధర్మమైనా పాటింపకున్న మానవ జీవ వేదనా భరితమే"

సర్వము విడిచి భక్తిగా ఇష్ట దైవనామమే మహాయజ్ఞం సర్వఫలాలు భూలోకమే దైవలోకమై దేహమే దేవాలయం అవుతుంది.

"నివారణ యంత్రస్థాపన చేసి, యథాశక్తి కలశము పెట్టి, పవిత్రనామ నీరుపోసి, మేడి, మట్టి, రావి, జువ్వి, మారేడుదళ, కొబ్బరి కాయపై ఎట్టని వస్త్రమునకు అలంకారము ఇష్టరీతిని చేసుకొనవచ్చును."

"జువ్వి కొమ్మ-కొమ్మ ఆరణి కవ్వంగా చేస్తే అగ్ని ఉద్భవిస్తుంది".

ఇక దుర్గాదేవిని శివుని, ముందుగా గణేశ ప్రార్థన చెయ్యాలి.

# శ్రీ కనకదుర్గ కాంచన మాలలు

## దుర్గా కపిల మల్లేశ్వరస్వామి పూజా విధానం

1. కనకదుర్గా శివాయ నమః - ధ్యానం
2. కనకదుర్గా శివాయ నమః - వజ్ర వైఢూర్య మణి ఖచిత సింహాసనము
3. కనకదుర్గా శివాయ నమః - ఆవాహన దుర్గా శివ దేవులకు చేసి సింహాసనాస్థిరులను చేయాలి.
4. కనకదుర్గా శివాయ నమః - సమర్పయామి

5. కనకదుర్గా శివాయ నమః - అర్ఘ్యం సమర్పయామి

6. కనకదుర్గా శివాయ నమః - స్నానం సమర్పయామి

7. కనకదుర్గా శివాయ నమః - వస్త్రము, బంగారు నేతవెట్టుని వస్త్రములు సమర్పయామి

8. కనకదుర్గా శివాయ నమః - యజ్ఞోపవీతం, మాంగల్యం సమర్పయామి

9. కనకదుర్గా శివాయ నమః - సుగంధం సమర్పయామి

10. కనకదుర్గా శివాయ నమః - సర్వ పుష్పసుగంధ పరిమళాల పూజ

11. కనకదుర్గా శివాయ నమః - దివ్య అక్షితలు

12. కనకదుర్గా శివాయ నమః - సాంబ్రాణి ధూపం సమర్పయామి

13. కనకదుర్గా శివాయ నమః - బంగారు ఐదు ఒత్తుల దీపాలు

14. కనకదుర్గా శివాయ నమః - సర్వ నివేదనలు భక్ష్య భోజ్య చోహ్యా, లేహ్యా మధురసాలు నివేదన

15. కనకదుర్గా శివాయ నమః - అఖండ ఆనంద కర్పూర నీరాజనం

16. కనకదుర్గా శివాయ నమః - సువర్ణ మంత్రం

17. కనకదుర్గా శివాయ నమః - ఆత్మ ప్రదక్షిణ

18. కనకదుర్గా శివాయ నమః - అపరాధ స్తోత్రాలు

# శ్రీ కనకదుర్గా దేవి

## మహిషాసురవధ

దేవతలు మహిషుడు పెట్టే బాధలు భరింపలేక శ్రీ దేవిని ప్రార్థించారు. సమస్త దేవతా శక్తుల నుంచి మహాశక్తి శ్రీదేవి ఆవిర్భవించింది. దేవతలందరి శక్తులు ఆ తల్లిలో లీనం అయ్యాయి.

**పాలసముద్రుడు** : తెల్లగా ఎట్టగా మేలిమి బంగారు పట్టుచీర, మేలిమిముత్యాల హారాలు

**విశ్వకర్మ** : సహస్ర కొట్లాది కవచకుండలాలు, కిరీటి మణి చూడామణిని, రత్నాలతో అనేక బంగారు ఆభరణాలు

**త్వష్ట** : దేదీప్యమానమైన రత్నాల అందెలు, కడియాలు,

**సముద్రుడు** : మణిమయ ఉంగరాలు మణిమురుగులు

**వరుణుడు** : ఎన్నడు వాడని పరిమళ సుగంధమాల

| | | |
|---|---|---|
| **వాయువు** | : | మహాచాపాన్ని, అంబుల పొది. |
| **హిమవంతుడు** | : | బంగారు సింహాసనాన్ని, సింహవాహనము, రత్నాలహారము |
| **విష్ణుమూర్తి** | : | దేదీప్య విరాజమాన సహస్రార చక్రము |
| **శివుడు** | : | తీవ్ర రుద్ర శక్తుల త్రిశూలము |
| **బ్రహ్మ** | : | దివ్యమంగద వాస్తవము, నీలపుడుము కమండలము |
| **వరుణుడు** | : | ఘోషవంతమనే సముజ్వల శంఖాన్ని, పాశము, |
| **అగ్ని** | : | శక్తి శతగ్నిఅగ్ని |
| **ఇంద్రుడు** | : | వజ్రాయుధము, ఐరావతము, భీకర శబ్ధఘంట |
| **యముడు** | : | కాలదండమ్ము |
| **విశ్వకర్మ** | : | గండ్ర గొడ్డలి |
| **కాలుడు** | : | కరవాలము, డాలు, |
| **కుబేరుడు** | : | మధుపాత్ర |

శ్రీదేవి ఇవన్నియు ధరించి మహిషాపురానికి కొన్ని ఆమడల దూరంలో స్థావరము ఏర్పరుచుకొంది. శ్రీదేవి, రథ, హయ, గజ, సేనలతోయుద్ధ సంకేత స్వర శంఖాన్ని పూరింప, మహిడు తన సేనలతో పోరు మొదలయ్యింది. ఉగ్రుడు సేనానాయకుడు, మహామనువు రక్షససేనాని, అనేక వీరులు మహాక్రూరు దివ్య శస్త్ర పరం పర కురిపించి నా దేవి సర్వం నాశనము చేసింది.

మృగరాజు జూలు విదిలించి రాక్షస సమూహాల మధ్యగా విజృభించగా, రాక్షసులు సంహారించామని భ్రమపడే దేవతలు మరల యుద్ధం చేస్తున్నారు. మాయావి మహా మాయావి చిఱునవ్వు నవ్వినా పై పెదవి మాయక్రింది పెదవి మహాశక్తి , చిక్షురుడు బలశాలి రక్షసుడు, శూలప్రయోగంతో నేలకూలాడు చామరాసురుడిని సింహియే కాలరాసింది. ఉదగ్రుడు, కరాళుణ్ణి ముష్టి ప్రహారాలతో సంహరించింది.

గదా ప్రయోగంతో ఉద్ధవుడిని, బింధివాల ప్రయోగముతో భాస్కలునీ, బాణపరం పరలతో తామ్రాసుర, అంధకాసుర, త్రిశూలముతో ఉగ్రాస్య, వుగ్య వీర్యా సురుల సంహరించింది. ఖడ్గ ధారలతో బిడాలునీ, శరాఘాతంతో, దుర్ధరునీ దుర్ముఖుని సంహరించింది.

దేవి రాక్షస మహావీరులను మట్టు బెట్టడం చూసి మహిషరూపము దాల్చి మహాభీకరంగా అరుస్తూ రాగా, పాశముతో వాడిని బంధించగా, మరల పురుషాకారము దాల్చాడు వాడుసింహ, గజ, రూపాలతో, అంబసింహాన్ని గాయపరచగా, దేవి మహోన్నత కోపంతో, సురాపానం చేసి ఎఱ్ఱవారిన నేత్రాలలోంచి మహా అగ్నుల జ్వాలలు సృష్టించి విపరీత

అట్టహాంసతో సర్వం ఎట్టని జ్వాలలతో మహిషుని కండ్లు కనిపించలేదు, మహిషుడిని ఒకే ఒకవుదుటులో క్రింద పడవేసి పాదంతో కంఠాన్ని నొక్కి పట్టి శూలంతో హింసింప, ముఖము నుండి వేరేరూపం రాగా దేవి శూలయుధంతో బలంగా త్రొక్కి, నిశితఖడ్గంతో శిరస్సు ఖండించింది.

సర్వదేవతలు దేవిని స్తోత్రాలు చేసారు. ఆనంద విజయ పతాకాలు ఎగురువేసి సర్వ దేవతలు, నాట్య, గాన, రాగ తాళయుక్తాలతో విజయ దశమి వేడుకలు చేసికొని, అమ్మదేవిని సర్వ సేవలతో అందరు వారి వారి విద్యలతో ఆనంద పరచారు. గంధర్వ గానాలు, అప్సరస నాట్యాలు, నాద బ్రహ్మలు, వేద బ్రహ్మలు, యక్షులు తమ మాయతో అమ్మ విజయము ఎలా జరిగినది దృశ్యరూపకంగా, కిన్నెర కింపురుషులు మహోన్నత విజయ నాట్య ప్రదర్శనలు, గరుడులు మనోవాయువేగాల శ్రీదేవి యుద్ధంచూప, నాగజాతివారు పాలసముద్రంలో తమ ఆనందం వ్యక్తము చేసాయి, అనేక ఆభరణాలు మణులు, ముత్యాలు సాగర గర్భము నుండి వాటి ఆనందం వ్యక్తం చేసాయి. చిలుకలు, మయూరాలు, కోకిలలు, జింకలు చరాచరా సృష్టి తమ తమ ఆనందాన్ని వ్యక్తము చేసాయి.

# శ్రీ దేవి మహత్స్యం

సర్వదేవతలు దుర్ఘటన కార్యసాధన సాధించి మమ్మల రక్షించి "దుర్గ" నామ ధేయంతో వెలవ వెలసినదని కోరగ, విజయవాడలో దుర్గా కపిల మల్లేశ్వరిస్వామితో వెలసింది.

జయవాడ అని పిలువబడే ఈ నగరంలో రాజు ధర్మపరాయణుడు, విజయపాల యువరాజు రథవేగముతో ముగ్గురు మంత్రి సేనాని రాజ పుత్రులు వస్తూ ఉండగా, రాకుమారుని రథము క్రింద ఒక బాలుడు ముసలి అవ్వను చూసుకుంటున్న ఏకైక వారసుడు రథచక్రాల క్రిందపడిచనిపోతాడు. ధర్మ పాలుడు, యువరాజును ఆవిధంగానే శిక్షించాలని తీర్పు ఇవ్వగా, దుర్గాదేవి గగన మండలములో ప్రత్యక్షమై రాజు ధర్మానికి సంతోషించి కనకవర్షం కురిపించి, బాలుని బ్రటికించి, యువరాజుని రక్షించింది.

ఆ రోజు నుండి "కనక దుర్గ" అని పిలువబడుతు, జయవాడ, విజయవాడగా ప్రసిద్ధి చెంది అలాగే పిలువబడుతోంది.

| | | |
|---|---|---|
| మోహనమూర్తి విజయవాడ విజయకారక | - | కనకదుర్గకు కాంచన మాలలు |
| అమ్మా నీముగ్ధ మోహన రూపునకు | - | కనకదుర్గకు కాంచన మాలలు |
| అమ్మా పంచహారతి మంగళ కాటుక కన్నులకు- | | కనకదుర్గకు కాంచన మాలలు |
| అమ్మా కస్తూరి తిలకమునకు, నీలాల ముంగులకు- | | కనకదుర్గకు కాంచన మాలలు |
| అమ్మా అనేక షోడశోప చారాలు చేసి నీకు | - | కనకదుర్గకు కాంచన మాలలు |

అమ్మా సర్వాలంకార భూషితురాలికి - కనకదుర్గకు కాంచన మాలలు
అమ్మా మాతృత్వమమతాను రాగాల - కనకదుర్గకు కాంచన మాలలు
అమ్మా గణపతికి తల్లివి నీవే మాకు రక్షయైన - కనకదుర్గకు కాంచన మాలలు
అమ్మా శివసతికి, కుమార మాతకు మమతల - కనకదుర్గకు కాంచన మాలలు
అమ్మా విష్ణు సోదరికి, పసుపు కుంకాల
మాంగల్య - కనకదుర్గకు కాంచన మాలలు
అమ్మా సర్వ మానవుల బ్రోచే కరుణాల వల్లికి - కనకదుర్గకు కాంచన మాలలు
సర్వ శుభమంగళ జయహారతులు నిచ్చె - కనకదుర్గకు కాంచన మాలలు

శుభమ్

# సర్వ దేవతా శక్తిపాట

సర్వ విఘ్నముల నెడబాపి కన్న తల్లి ప్రేమకురిపించు విఘ్నేశ్వరి
పసుపుకుంకుమ లిచ్చి మాంగల్య శోభనిచ్చు మంగళగౌరి
సర్వ ఐశ్వర్యములిచ్చు వరప్రదాయినీ దేవి వరలక్ష్మి
సర్వ విద్య, గాన, జ్ఞానము, సర్వయోగమునిచ్చు సరస్వతిదేవి
సర్వ ఇచ్ఛాక్రియాశక్తుల జ్ఞానంబుల నిచ్చు తల్లీ జ్ఞానప్రసూనాంబ
సర్వ మానవుల మేలు కోరి మమతానువల్లీ అలమేలు మంగ
సర్వ మానవులకు చరా చరా సృష్టికి అన్నమునిచ్చు అన్నపూర్ణ
సర్వుల భ్రమలు తొలగించి ఇహలోక భ్రమనాశము చేయు భ్రమరాంబిక
మంచి మనసుతో ఈశుని కొలిచి తరించిన మల్లిమల్లికార్జునసతి
నిశ్చల భక్తితో నలుబది పద్యాల శ్రీ రంగనాథుని పత్నీ అమ్మా గోదాదేవి
మీనముల వంటి నేత్రములతో మానవులగాచిన మధుర మీనాక్షి
నిరూపించె, శీలమే ప్రధానమని తపస్సుతో కుసుమ శ్రేష్ఠిపుత్రీ శ్రీ వాసవి కన్యకపర
రాజీవ లోచన అనన్య లావణ్యరాశి శ్రీ రాజరాజేశ్వరి
పరమపావని గణపతిని కుమారస్వామిని కన్నతల్లి పార్వతీ దేవి
దయా శీలా కరుణ వరుణా కరి మహాతపస్వి ఉమాదేవి
బాలా మహా భక్తుల వశ్యని సర్వా భీష్టకరి బాలాత్రిపుర సుందరి
రాజు కూతురై అన్న పానాదుల భుజింపక స్కంధసతి దేవసేన
ఆట పాటలతో ఆమె నిజమైకోయవారింట సతి శ్రీ వల్లీదేవి కుమార

పసిపాపలను మహా ఘోర విపత్తులను తొలగించు శ్రీ వైష్ణవిదేవి
శంకరాచార్య ప్రతిష్ఠిత కొలమహర్షి కొలచిన దేవత శ్రీలక్ష్మి కాళీ సరస్వతి
మూకా సురుని తపస్సుకి మెచ్చివరమిచ్చి దుష్ట మూకాంబిక శిక్షణ చేసి నాతని
కోరికపై అయినది
మేలు మరు వత్తూరులో లింగరూపాన వెలసి
బంగారు వడివరక్కన్ ముద్దుకుమారుడు ఓం శక్తి
జనక మహారాజు పుత్రి "సీత" దశరథుని కోడలై శ్రీరామసతి సీతాదేవి
భక్త బృంద తీవ్ర విష్ణుభక్తితో తులసియై లక్ష్మి విష్ణు కృష్ణ తులసీ
భక్త రామాంజనేయుడు రామాయణ రత్న హనుమసతి సువర్చల
నిరక్షరాస్యుని మహాపండితుని రామకృష్ణునిచేసే శ్యామలాదేవి
కలియుగమున సర్వగ్రహములు నివారించు సత్యనారాయణ సతి శ్రీ రమాదేవి
సర్వ శుభముల ప్రసాదించి భక్తుల రక్షించు కళ్యాణి
భార్యాభర్తల అన్యోన్య అనుకూలదాంపత్య మిచ్చు పరదేవతాశక్తి
లవకుశులు, గణపతి, కుమార, అయ్యప్ప వంటి బిడ్డలనిచ్చు శ్రీ లలితా దేవ దేవి
సుబ్రహ్మణ్యాంశ ఉగ్రపాండ్యుడు, ప్రహ్లాదుడు ధ్రువుడు,
పుండరీకుడు, సత్యవంతుడు తల్లిదండ్రుల సేవచేసి వరప్రసాద
ఆ చంద్రాతారార్క కీర్తిచంద్రికలు వరప్రసాద వంశాభివృద్ధి పరమపావన పుత్రులు

# శ్రీ దుర్గా దేవి పాటలు

1. అమ్మా దుర్గాదేవి ఎంతటి అందాల రాశివే నవ్వకనే పలికించే
నీ అధర చిఱునవ్వుల అమృత ధారలు భక్తుల దప్పిక తీర్చెదవు
నీ నగుమోముతో, ఉంగరాలు ముంగురుల మేఘనా, దివ్యాతి దివ్య

అందాల చంద్రముఖి, అమ్మ ఆరాధించిన వలపుల వయ్యారి ఈశహృదయచకోరి,

ఇంతటి సోయగాల జగాలనే మోహా వేశుల చేసే తల్లీ,
మానవ దానవ దేవతల సహితము నీమోహమే మహామాయ,
అందాలు అందానివి, సర్వకళామతల్లీ, సర్వుల తల్లిప్రేమనే పంచి,

కనురెప్ప పాటి లేక దివ్య సుధారసమయి, రాగమయి,
వేదమయీ, నాదమయీ, నాట్యమయీ, నాదమయీ, సర్వ

శాస్త్రకోవిదా, యాగము యోగము మంత్రము తంత్రము
సర్వము నీవే నిరాడంబరీ హరి సోదరీ మాధవీ, మనోహారీ మహేశసతి, సర్వశక్తి

మయీ, నీ సౌందర్యల హరిలో, "లయ

కారునే వశము" చేసికొన్న సంజీవినీ రత్నమా, అమ్మా నీ రూపు, నీనామ, నీ ధ్యాన, నీ కవిత, నాగాన, నీ దివ్యలీలలే మరి మరి తలచి పులకించనీ పరవశించనీ

అమ్మా శ్వాసలో శ్వాసవై, సర్వము నీవై, నడిపించు, నేను లేనే లేను నీవే సర్వమ, నిఖిలము, నవనిధుల నవ నవోన్మేషనవ దుర్గా।

అమ్మాదుర్గామా మహావీర శౌర్య పరాక్రమ శక్తివై
విజృభించు తల్లీ నీ ఆలయాన చోరులా, చోరులకు
నీవే వరమిచ్చి కాపాడినావా, లేకున్న పాపభీతి,
దైవ భీతి నశించినదా మహోన్నతురాలవని నిన్నే
నమ్మికొనే దీనజన భక్తుల హృదయ శోకాలు తీర్చు
తల్లిలో, పాపభీతి, దైవభీతి, సర్వ ధర్మములు
నిలుపుమా వేడుకొనుటయే తప్ప ఇంకేమి చేయ
గలవారము నీవే, అండ, నీవే రక్ష, నీవే దిక్కు సర్వము నీవే దుర్గాదేవి

2. అమ్మా దేవి సరమేశు రాజ్ఞి, సర్వ నాట్య ప్రవీణా,
భూలోకవాసుల రక్షింప విజయవాడలో దుర్గవై వెలసినావా,
అనేకానే రూపాల ధరించి మావుల రక్షించి, దుష్ట శిక్షణచేసి

మహావీరశౌర్య పరాక్రమ వాయు మనోవేగ రణరంగధీరా,
మహిషాసురుని, శుంభ, నిశుంభుల, రక్తబీజాది రాక్షస

సంహారీ, దుర్గవై, వాసవీకన్యకవై, కన్యకాపరమేశ్వరివై,
సాధుజనుల రక్షించి ధరిత్రిన్ శాంతినిలిపిన తల్లి,

చతుషష్ఠి కళా ప్రపూర్ణా ఏమని నిన్నేమని కీర్తించనూ,
సర్వులకు తల్లివై మమతాను రాగాల సుమవల్లీ,

భక్తుల లాలించి దీవించి నీదరి చేర్చుకొను దయారూపిణీ,
కన్యకల, గృహిణులకు నీవే రక్షాగా నిలచిన నీలాంబరీ,

పరమేశు మాంగల్య మంగళ రూపిణి, దీర్ఘ సుమంగళీ వర
పసుపు కుంకుమ కుంభాల ప్రీతిణి, పరమేశురాజ్ఞి

సింధూర సిరినిచ్చు, సుదీర్ఘమాంగల్యాగా దరికిచేర్చు కొను కపిల మల్లేశ్వరసతి,
స్త్రీలలో సమయోచిత సందర్భాను సారవాక్కు ప్రసాదించు

మృదుమధురసంభాషిణి, సర్వ జనదేవ సమ్మోహినీ,
నీదీవెనే మాకు కొట్లాది దివ్యలై భవసాగరము దాటించు

శ్రీ కనకదుర్గా కపిల మల్లేశ్వరులారా, గణేశ కుమార సహిత
ఆదిదంపతులారా ప్రకృతి పురుషులై, ధన, కనక, వస్తు

వాహన అన్యోన్య అనుకూల దాంపత్య సత్సాంతన వంశోద్ధార,
ఆణిముత్యాలవంటి ఆడబడుచుల
నిచ్చి దీవింపవమ్మా, దయ చూడవమ్మా కరుణా

వృష్టినే కురిపించి పాలించు ప్రజల శివసతీ
విజయవాడ నగరాధీశ రాజ్ఞీ దుర్గాదేవి

3. అమ్మా దుర్గమ్మా తీర్చలేనిది తీర్చుకోలేనిది నీమమత,
నీ అనురాగం నీకరుణా, నీ దయ వీక్షణా, భక్త హృదయవీణా
నాదమే మోదమే నిండగా ఆనందముతో మనస్సే మయూరమై
మమతానురాగ సుమవల్లీ ఆనంద నాట్యమే అర్చించుకొను,
సుదీర్ఘ సుపరిమళకేశ ఉంగరాలే మేఘాలు కాగా నీలిముంగురుల
అలలమేఘాల మేఘనను కాంచిన వేళ వేసే ప్రతి అడుగు అడుగున
అణువులో పరమాణువులో నీవే నిండి ఆత్మానందనాట్యము చేసి,
పరంజ్యోతికి మముకాచు తల్లికి వేడుకలు యధాశక్తి చేయక
ఆగదమ్మ ఈ మనస్సు నీవశమైన దమ్మా దుర్గమ్మా।

కుమారిగా చక్కని ఎఱ్ఱని పట్టు వస్త్రము, సర్వాభరణాలు
రోజుకొక జడగా నవరత్నాలతో, బంగారు జడగంటలు, మణి రత్నహారాలు,
చిరుభుజాల వంకీలు, హస్తాలకు అనేకానేక సర్వరంగుల వేళవించు గాజులు
రతన ముద్ర మురిడిగొలుసు చిన్ని చిఱువేళ్ళకు ఉంగరాలు, నడుముకు
సవ్వడి చేసే జాలరుల పట్టెడ, పాదాల పారాణి మణి మంజీర సవ్వడు
లతో, మాడెందమే ఆనందమూర్తికాగా కుంకుమ కుంభాలు,
పసుపు కుంభాలు, సర్వనివేదనలు చేసికొని, సువిశాలనేత్రికి సర్వానంద
అఖండ మంగళ హారతినై పోతానమా దుర్గమ్మా నీకు నీరాజనమై పోతాను।

4. కుమారిగా స్వరమాధుర్యంబుగా స్తోత్రాలు చేసి తొలిపూజా,
దుఃఖనాశని దరిద్ర విమోచనికి, కుమారికి పరాన్ని చూపమని పరమాన్ననివేదన,
త్రివర్గఫలదాయిని త్రిమూర్తికి, మా హృదయ మమతాల పాలనివేదన,

వినయ విద్య సంపదలిచ్చే కళ్యాణికి, అనురాగ అరటిపండ్లు అమృత పాణినివేదన,
రోగనాశిని రోహిణికి హృదయ హయ్యంగకు వెన్ననివేదన,
శతృనాశనికి కాళికకు కరములు జోడించి కలకండని నివేదన,
ఐశ్వరాలనిచ్చే చండికకు చామరవీవెనతో చక్కెర, నివేదన,
విజయకార్యసిద్ధికి శాంభవికి శరణని అమ్మా ఆవు నెయ్యి, నివేదన,
దుర్ఘట కార్యాల సాధించే దుర్గకు పరతత్వ బోధ మరి మరి చేయు తల్లికి
పరమాన్నము నివేదన,
సర్వకోరికిలు తీర్చు సుభద్రకు, నీవేదిక్కని నీటముంచినా పాలుముంచినా నీవే రక్షని,
పాలు నివేదన, చేసి ఆనంద నీరాజనం

5. దుర్గమ్మా ఓ దుర్గామా మా సంసర సాగర రక్షకి నవారణ పూజలే చేసినవారణ
యంత్ర, కలశస్థాపనే
చేసి నవారణమంత్ర వేదోక్త కలశనీరు మేడి, మట్టి, రావి, మారేడు, జువ్వి
ఆకుల మధ్య, ఎఱ్ఱనివస్త్రము ఆభరణాలు పెట్టి, ఏకభుక్తము చేసి,
భూదేవి ఒడిలోని దురించి, తీయని స్వప్నలోకాల తేజసుడే ఆనందడోలలో
నవరాత్రి నయనానందనవనవ పూజలే యధా శక్తి
కొండంత తల్లికి గోరంత చేసికొంటాము దుర్గామ్మా।

# దుర్గాదేవి మంగళ హారతులు

నవరాత్రి ఉత్సవాల భక్తుల వారాలిచ్చేటి
తల్లికి వరహాల మంగళం, భక్తి వరహాల మంగళం,

ముద్దు మోముగా కుమారికి పసిడి బంగారు
తల్లికి దారిద్ర్య దుఃఖనాశికి, ఆనందమేలిముత్యాల హారతి, భక్తి ముత్యాల హారతి,

త్రివర్గ ఫలాలు ప్రసాదించు త్రిమూర్తికి,
దివ్య పడాల హారతి, భక్తి పగడాల హారతి,

వినయ, విద్యా సర్వ సంపదలిచ్చు కళ్యాణికి,
వినయనాద పచ్చల హారతి భక్తి పచ్చల హారతి,

రోగాలు నాశనము చేయు రోహిణికి,
ఆరోగ్య సూర్యమణి హారతి, భక్తి భావమణి హారతి,

శత్రునాశనము చేసి కాపాడు కాళికకు,
శాంతినిచ్చే తల్లికి చంద్రమణి హారతి, భక్తి చంద్రమణి హారతి,

సర్వ సంపదల నిచ్చు చండికకు,
దారిద్ర్య నాశనికి లక్ష్మీమణి దీప హారతి, భక్తి మణి హారతి,

సర్వ సంపదలనిచ్చు చండికకు,
దారిద్ర్యనాశననికి లక్ష్మీమణి దీప హారతి, భక్తి పూర్వ గోమేధిక హరాతి,

విజయ కార్య సిద్ధుల నిచ్చు శాంభవికి,
మేలైన గోమేధిక హారతి, భక్తి పూర్వగోమేధిక హారతి,

దుర్ఘటన కార్య సిద్ధినిచ్చి మహా తీవ్ర కష్టాల కాపాడు దుర్గమ్మకు,
నివారణ పూజా ప్రీతిణికి నవరత్నాల హారతి, భక్తి నవ రత్న హారతి,

సర్వ కోరికలు తీర్చి కష్టాల రక్షించు సుభద్రకు,
సర్వ శుభ విజయ వజ్రాల హారతి, భక్తి వజ్రాల హారతి,

సర్వమానవ దానవ దేవతలకా ధారమైనట్టి అమ్మకు,
సర్వ శుభదివ్య మంగళ ఇంపైన కెంపుల హారతి,
అఖండ ఆనంద భక్తి నవవిధ భక్తి రతనాల మంగళం

## దుర్గాదేవి మంగళము

అందాల పసుపు వచ్చని కల కలలాడు మాతల్లి మోముకు,
పంచప్రాణ రతనాల హారతి, భక్తి రతన హారతి,

కటక కిరీటికి, సూర్య చంద్రులే నేత్రాలుగా అగ్నియే కస్తూరి
తిలకధారిణికి, సుగంధ పూమాల ధారిణికి,

పుష్యరాగాల నీరాజనం, భక్తి పుష్యరాగా నీరాజనం,
దివ్య కర్ణ కుండల కవచధారిణికి, ఎఱ్ఱని వస్త్ర ప్రీతిణికి,

మా అమ్మనత్తు అధరాలు చిఱునగవుకు,
నత్తురతనాలు కదలేటి తల్లికి పగడాల అధరసుధా హారతి, మందహాసకు భక్తి పగడాల నీరాజనం,

చంద్ర సూర్య కోట్లాను కోట్ల చంద్రముఖికి, కమల నేత్రికి,
మోహన రూపుకు మాణిక్యాల నీరాజనం, భక్తి మాణిక్యాల నీరాజనం,

మము హృదయాన చేర్చుకొని ఓదార్చు రతనాల హారాల ఉత్తుంగ వక్షస్థలికి, మమతనీలాల నీరాజనం, భక్తి నీలాల నీరాజనం,

చక్కని రతన జాలరుల సన్నని నడుమునకు అమరికగా మణిమేఖలాల జాలరుల పట్టికకు, పద్మరాగాల నీరాజనం, భక్తి పద్మరాగాల నీ రాజనం,

అనేక ఆభరణ, ఆయుధాల, మణి మంజీరాల పాద పద్మాలకు,
దివ్య అందాలు విరజిల్లు, దివ్యానందము నిచ్చు తల్లిదర్శనమునకు,

వైఢూర్యాల నీరాజనం, భక్తి వైఢూర్యాల నీరాజనం,
సాధుజనులను రక్షించి దుష్టుల శిక్షింప, అష్ట భుజదుర్గవై,
శంఖ, చక్రము, శూలము, పాశము, వజ్రాయుధ, కరతీలడాలు, కాలదండము,
దివ్యక మండల హస్తము, గండ్రగొడ్డలి, మధుపాత్రతో,

భక్తులకందరికి అభయ హస్తినివై
రక్షించుతల్లికి, సర్వదివ్య తేజోతపోమణి హారతి, భక్తిమణి హారతి
అఖండ ఆనంద కర్పూర మంగళ హారతి

# దుర్గాదేవి మంగళ హారతులు

అమ్మ శుక్రవార పూజా ప్రీతిణికి, సర్వాలంకారకు,
కుంకుమ పూజాదుల సమర్పించుకొని, సింధూర సిరినిచ్చు తలి దివ్య అగ్ని ఏక నీరాజనం,

శివ మాంగళ్యకు, పసుపు కుంభాల సమర్పించుకొని,
మాంగళ్య దివ్య హారమునిచ్చు తల్లికి, సర్వ నవ విధ భక్తి పుష్పాల నీరాజనం,
పసుపు కుంకుమ, మాంగల్య శోభలనిచ్చి అన్యోన్య దాంపత్య
జీవనమిచ్చేటి తల్లికి సర్వ సద్గుణాల నీరాజనం,
సత్సంతానము నిచ్చి, నిజ భక్తుల కాపాడు ముగ్ధ మోహన
దివ్య మంగళకు, ఆత్మానంద నీరాజనం,
అమ్మా నీ కరుణ నీ అభయమే మాకు మా ధర్మబాట చూపించు తల్లికి షట్ చక్రాల నీరాజనం,
కాలమెంతగ బాధించినా కాలమును పాశముతో బంధించి,
కాలనాగినివై రక్షించు తల్లికి కుండలినీ శక్తి నీ రాజనం,
వాయుమనోవేగాల మించి నీ భక్తుల సంరక్షించు తల్లికి,
పరస్య శరణాగతి మంగళం, ఆత్మనీరాజనం

అమ్మా చక్కని సుగంధకేశపాశినికి వజ్ర ముద్రల నమర్చి, చూడామణిని పెట్టి, వజ్రవైఢూర్యమణి ఖచిత కటక కిరీటము, నమర్చి,

నీలాల ముంగురుల ముద్దు మోముకు కస్తూరి తిలక కాటుక సోగకన్నుల అందాల చూచి, సుదీర్ఘనాశికకునత్తు నమర్చి,

ఎఱ్ఱని అధరాలు నత్తు రవ్వలు కదిలే తల్లి చిఱునగవు చూచి తరించి, అందాల చుబుకము చెక్కుటద్దాల ముద్దులే మనోముద్దులేపెట్టి,

కర్ణకుండాలాల కవచ ఎఱ్ఱనివస్త్రము సర్వాభరణాల నమర్చి, భుజకీర్తుల పెట్టి,

నడుముకు పట్టెడ నమర్చి, పాదాల పసుపు పారాణి, మంజీరాల పెట్టి, సర్వ సుగంధ మాలలేవేసి,

సర్వషోడశోపచారములు ఈదేహమై సర్వేంద్రియాలు నీకు వశమై, మనోనాశమై,

దివ్యజగత్ సౌందర్యరాశికి, జగన్ మోహినికి,

సర్వ నీరాజనాలై నీలో కలసి మెలిసి,

అమ్మపాద పద్మాల రేణువై సర్వ నక్షత్ర, పంచ, త్రిశూల నాగ, ఏక ఆత్మాహారతి, ఆత్మానంద హారతి, పరానంద పరంజ్యోతిలో ఏకజ్యోతి నై నీరాజనమై పోయెదన్

# దుర్గా దేవికి మంగళహారతి

1. పసుపు కుంకులిచ్చు మాంగల్యా భరణము నిచ్చు, పరమ పవిత్ర గాత్రి దయా దుర్గకు ఇదే మా భక్తి నీ రాజనం,
తన భక్తులకు జ్ఞాన సరస్వతియై విద్యల నిచ్చు పరమ పవిత్రగాత్రి దయ దుర్గకు శ్రీవిద్యా నీ రాజనం,
మహా భయ శత్రువుల నుండి రౌద్రిణియై కాపాడు, పరమ విత్ర దయా దుర్గకు వీర నీరాజనం,
నిజభక్తితో పూజించు భక్తులకు దివ్య శక్తలనిచ్చు పరమ పవిత్ర గాత్రి దయా దుర్గకు భక్తి నీ రాజనం,
భార్య భర్తల అన్యోన్యదాంపత్య పవిత్ర జీవనమిచ్చు పరమ పవిత్ర దయా దుర్గకు , నమస్కార నీ రాజనం,
సత్సాంతన వంశాభివృద్ధి వరమిచ్చు తల్లికి పరమ పవిత్ర గాత్రికి దయా దుర్గకు, వర నీరాజనం,
సర్వవేళల శ్వాసలో శ్వాసగా నీ నామ జప ఫలసిద్ధి నిచ్చు పరమ పవిత్ర గాత్రి దయా దుర్గకు, నామ నీ రాజనం,
పుత్రికలకు విద్య ధైర్య ధర్మ విజయాలనిచ్చు తల్లికి పరమ పవిత్ర గాత్రి దయా

దుర్గకు, అనురాగ నీ రాజనం శ్రీ కపిల మల్లేశ్వరి కనక దుర్గకు అఖం
రాజనం

2. సద్గురు స్వరూపిణి జ్ఞాన మార్గ బోధిని, పాప దగ్ధకు
పరమ పవిత్ర గాత్రి దయా దుర్గకు, జ్ఞాన నీ రాజనం,

సర్వుల అనురాగముతో సుస్థిర చిత్తులకు ఆనందమిచ్చు
పరమ పవిత్ర దయా దుర్గకు, ఆనంద నీ రాజనం,

జన్మ జన్మాంతర కర్మపాశా విముక్తి నామ మాత్రానిచ్చు
పరమపవిత్ర దయా దుర్గకు, ఆరాధ్య నీ రాజనం,

స్వార్థమువీడి నిస్వార్థ నిర్మల నామాన కొలిచితే సర్వ
ప్రారబ్ధ నాశనికి దయా దుర్గకు, భక్తి నామ నీ రాజనం,

సర్వరోగనాశని, బవబంధ మోచనీ, భావనాగమ్యకు
దయా దుర్గకు పరమ పవిత్ర గాత్రికి ఆరాధ్య నారాజనం,

ఇహ కోరిక నాశిని, పరాసి నంద ప్రదాయినీ, రక్షించుతల్లికి
దయా దుర్గకు పరమ పవిత్ర గాత్రకి, జయమంగళ నీరాజనం,

అష్ట భుజ దుర్గవై దివ్యశక్తి, భుక్తి, భోగ, నామజీవ ప్రదాయినికి
సర్వ వేళల సంరక్షించు దయా దుర్గకు దివ్య శుభ నీ రాజనం

నీవే దిక్కన్న అండగా ఎల్లవేళల విజయాల నిచ్చు
దయా దుర్గకు, వీర విజయ సింధూర నీ రాజనం
శ్రీ కపిల మల్లేశ్వర కనక దుర్గకు ఆత్మానంద నీ రాజనం

అహము విడచి సర్వాంతర కర్మలన్ని విడచి, ఆ మహాజ్యోతి
పరాజ్యోతి దయా దుర్గాజ్యోతిలో లీనం కానా

## మంగళహారతులు

శీతాద్రి శిఖరాన పగడాలు తాపించు మాతల్లి నత్తుకకు
నీరాజనం కెంపైన నీరాజనం భక్తి కెంపైన నీరాజనం.

యోగీంద్ర హృదయాన మ్రోగేటి మాతల్లి బాగైన అందెలకు
నీరాజనం, బంగారు నీరాజనం, భక్తి పొంగారు నీరాజనం.

నెలకొల్పు డెందాన వలపు వీణలు మీటు మాతల్లి గాజులకు
నీరాజనం, రాగాల నీరాజనం, భక్తి తాళాల నీరాజనం.

మనుజాళి హృదయాన తిమిరాలు తొలగించు మాతల్లి నవ్వులకు
నీరాజనం, ముత్యాల నీరాజనం, భక్తి నృత్యాల నీరాజనం.

చెక్కిళ్ళ కాంతితో కిక్కిరిసి అలరారు మాతల్లి ముంగురులకు
నీరాజనం, రతనాల నీరాజనం, భక్తి జతనాల నీరాజనం.

పసిబిడ్డలను చేసి ప్రజలనెల్ల పాలించు మాతల్లి చూపులకు నీరాజనం,
అనురాగ నీరాజనం, భక్తికనరాగ నీరాజనం.

పగడాల మరపించు ఇనబింబ మనిపించు మాతల్లి కుంకుమకు
నీరాజనం, నిండైన నీరాజనం, భక్తిమెండైన నీరాజనం.

ఏటిపిల్లల వోలె గాలి కల్లలవాడు మాతల్లి కురులకు నీరాజనం,
నీలాల నీరాజనం భక్తి భావాల నీరాజనం.

జగదేకమోహిని, సర్వేశుగేహిని, మాతల్లి రూపులకు నీరాజనం,
నిలువెత్తు నీరాజనం భక్తి నిలువెత్తు నీరాజనం.

!! మంగళం - మహత్ !!

# బ్రహ్మ ముహుర్తమున వచ్చిన అనుభవాలు

1. అమ్మా ఎన్నెన్ని అనుభవాల నవరత్నాల రాసులు ఒడి నింపావమ్మా. ఎంతటి అనురాగం ఆపేక్ష ప్రేమ మమతాను బంధాలతో నన్ను ఎంతగారాబం చేసావు. ఎంత మురిపించి మరల ఈ భూలోక సంబంధాలతో ముంచెత్తడం న్యాయమేనా? అమ్మా నీ కరుణ, దయ, జాలి, క్షమా ఏమయ్యాయి? మరల శాశ్వతంగా నన్ను నీ దరికి చేర్చుకోవమ్మా బంగారుతల్లీ.

అమ్మ నీపాద మంజీరనాదాలతో కలవాలనీ ఆ మువ్వలలో ఒక్కమువ్వనై పోవాలని మురిసిపోయానమ్మా. ఎందువల్లనంటే ఎందరో భక్తులు వారుకూడా యిట్లానే తలచవచ్చునే అందరి దానవు కదమ్మా. అందుకేనమ్మా ఒక్క మువ్వనైనా చాలునే, ఆ పాదపద్మాల రేణువునైనా మురిసి పోతానమ్మా.

ఆ సోగ కన్నులలో ఆ సోగసైన సొగసై సంధించినట్లుగా ఉంటే ఆ ధనస్సు అనే బింబాధరాలపై దరహాస చంద్రికనవ్వనా ఆ పెదవి విరుపుల్లో ఒంపుల్లో ఎన్నెన్ని పగడాలు, ముత్యాలు జాలువారెనో తల్లి. సూటిగా నుండే నీ నాసికను చూస్తూంటే ధర్మమార్గమును చూపుతున్నట్లుగా ఉంటూ మరల అధర్మమే ఆచరిస్తే కరుకైన చురకత్తివలె ఉందమ్మా.

అమ్మా నీవు అలా మెల్లగా కదలి వస్తూంటే పూర్ణచంద్రుని వంటి ఆ మోముని మోసే ఆ శంఖాకారము వంటి కంఠము, ఇరువైపులా తామరతూడులకన్న సున్నితమైన ఆ

భుజములు, ఆ పద్మములవంటి హస్తములు, వక్షస్థలి బరువునకు మెల్లగా నడుమూ, జఘనము కదలాడ, పిరుదులు తూగాడ మొలనూలు గజ్జల సవ్వడులతో ఆ జఘన భాగమున యిరుప్రక్కలా నుండే తల్లీ మత్తగజము తొండమువలె ఉండే తొడలనుండి పాదాలభాగమును అరటిదూటతో పోల్చిన మోటుగనుండేనమ్మా, చక్కని కదంబమాలలలై ముగ్ధ మోహన రూపంతో కదలివస్తూంటే, అనేక పరతత్వ చిహ్నాలతో నుండే ఆ ఆపాదపద్మాలతో మనస్సే విహంగమై అమ్మ అనే ఆకాశ వీధులతో హద్దులే లేకుండా విహరిస్తున్నదమ్మా మనస్సు నీలో ఉప్పొంగే, ఆ పరువాల ఉరవళ్ళు చూస్తూంటేనాలో అలలువోలె ఎన్నెన్నో నాదాలు ఆవిర్భవిస్తున్నాయి. ఊహకే అందని నీ ముగ్ధ మోహనరూపాన్ని, నీ యొక్క గొప్పతనమును శౌర్యప్రతాపములు అలుపే లేకుండా ఆపక అలాకీర్తించాలనిపిస్తోందమ్మా. అనురాగవల్లీ, ఓ మమతానురాగాల మల్లీ, అమ్మా ఎన్నేళ్ళు యింకా, ఎన్నాళ్ళు ఈ శాపగ్రస్థ జీవితం. అమ్మా ఎప్పుడమ్మా, ఈ ప్రపంచచెఱసాల నుండి నాకు విడుదల, తల్లీస్వేచ్ఛను ప్రసాదించవమ్మా. దయచూపవమ్మా కారుణ్యాన కావవమ్మా కిష్టమ్మ తల్లీ.

అమ్మా నిన్ను చూడకుండా నేనెట్లా బ్రతికేది? ప్రొద్దు ఎట్లా గడిచేది? అమ్మా ఈ ప్రాపంచక సుఖాలు మరింత బాధపెడుతున్నాయేగాని, నాకు ఊరట కలగడంలేదు. నా బంగారుతల్లీ, నీ ఒడిలోని నన్ను చేర్చుకొని లాలించి పరిపాలించవమ్మా.

2. అమ్మా నీవు ప్రొద్దున ఎఱ్ఱని పట్టుచీర ధరించి వజ్రవైఢూర్యమరకత మాణిక్యాల ఆభరణములు ధరియించి నీవు సభలో కొలువుతీర్చి మంత్రులతో సభలో అలా ముచ్చటిస్తూంటే, కోటి సూర్యులు ఒక్కమారు, ఉదయించినట్లు, చండ ప్రచండ వీరశౌర్య ప్రతాపాలతో ప్రజ్వలిస్తావు.

ఓ మహారాజ్ఞి అలా నీవున్నప్పుడు, ఈ అమ్మయే నా అనురాగ రూపిణియై చక్రపొంగలిపెట్టి అనురాగకడలిలో ఓలలాడించిన ఆ కారుణ్యామూర్తి ఈ అమ్మేనా అని అనిపిస్తోందని నేను బేలగా చూస్తూంటే అంతటి మహారాజ్యాంగంలో, రాజహంసలా ఉంటే నీవే ఒక్కమారు నాకేసి అట్లా సాదరమైన ఆ సన్నిహిత దృక్కుతో ఒక్కసారి చూసినట్లే చూసి మరల నింతలోనే రాజసం ఉట్టిపడేలా గంభీరవదనంతో స్వయంగా ఎంత చక్కగా పరిపాలనా విధులన్నీ నీవే చూసుకుంటున్నావామ్మా.

అమ్మా ఈ అమ్మ పదునాలుగు భువనాలను శాసించే మహారాజ్ఞి అని తలుచుకుంటేనే గర్వంతో మేను గగుర్పొడొస్తోందమ్మా.

శ్రీ లలితా మహారాణికి జై జై అనే నినాదాలతో నాల్క ప్రతిధ్వనించాలి అని అనిపిస్తోందమ్మా.

3. అమ్మా ఎల్లప్పుడు నీ తలపుతో నీతో నే వలపుతో నీ వయ్యారాలవలలో

స్వయంముగా నేనే పట్టుబడి సర్వకాల సర్వావస్థలలో నిన్నేతలవాలనీ నీ గురించే పలురకాల పలుపలు విధములుగా యోచించి ఎన్నో మరెన్నో సేవలు నీకు చేసుకుంటూ నన్ను నేనే మరవాలని పిస్తోందమ్మా.

4. అమ్మా సాయం సమయంలో ఉద్యానవనంలో ముత్యాల పగడాల మండపంలో నిరాధారమైన ఉయ్యాలలో తెల్లని పట్టుచీర కట్టుకొని, ముత్యాలు పగడాలు రత్నాలతో చక్కగా అమర్చిన ఆభరణాలు పెట్టుకొని ఎంతో నాజూకుగా పగడపు బొమ్మలా ఉండే ఓ బంగారుతల్లీ నిన్ను నేను ఏమని వర్ణింగలను? అమ్మా ఇంత వయ్యారంగా మరెంతో మృదు మధుర సమ్మోహన సలలితగాత్రివైన నీవు ఈ పట్టుచీరను యిన్నెన్ని ఆ భరణాలు ఎలా మోయ గలుగుతున్నావమ్మా.

నీవు నెమ్మదిగా అట్లా అలా ఊయలలో ఊగాడుతూంటే చూడటానికి కోటి కన్నులున్న చాలవే చిట్టితల్లీ. అలా ఊయల ఊపులకు సరిగా లయబద్ధంగాపాడే ఆ గంధర్వగానముతో కూడిన వీణానాదము అంతకన్నా మధురాతి మధురమైన నీ కిష్టమైన హల్లీహాలస నాట్యము వృత్తాకారంలో చూస్తూంటే నీ మోముపై ఆలలంతకా పాపిట పిందినీల కదలాడుతూంటే సోయగాల సుమబాలవైన నిన్ను వర్ణించడానికి కోటి నాల్కలుగల ఆ ఆదిశేషువుకైనా సాధ్యము కాదు. నేనెంతటి దానును తల్లీ నీ కోట్లాది సృష్టిలో ఒక్క అల్పప్రాణిని నీకు పట్టు బట్టు నాతల్లీ.

5. ఏదో వర్ణించవలెనని పట్టువస్త్రంబని వజ్రవైఢూర్యమరకత మాణిక్య ఆభరణంబులని వర్ణించుటేగాని, అంతే పట్టని అలవికాని దేవితోను పోల్చుటకు వీలుగాని అనన్య అద్భుత అజేయ అప్రమేయ సౌందర్యముందు ఏదియైన ఏ పాటిది తల్లీ.

ఏదో కవుల వర్ణనకు చిక్కాలని అప్పుడప్పుడు అలాపాదాలతో నడచి వస్తున్నట్లు భ్రమభ్రాంతి కల్పిస్తావేగాని, నిరాధారంగా ఊగుతున్న ఆ ఊయలలోని నీవు ఎప్పుడెప్పుడు వస్తావని ఎదురు చూసే ఆ భక్తులకు అత్యంత అద్భుత ఆనందపు జల్లులాగే ఆకస్మిక ఆ ఆవిర్భావం కాంచవలసినదేగాని భాషకు, భావమునకు, చిత్రానికి, నాట్యానికి, గానమునకు వేయేల సమస్త సర్వకళలతో చూపడం మిక్కిలి అసాధ్యం తల్లీ. అమ్మా నిన్ను ఎడబాసి ఉండలేక శోకిస్తానేగాని నిజమునకు నేనుకూడ ఎంతో భాగ్యశాలినమ్మా. ఈ సంసారాంబుధినుంచి నన్ను తప్పించి నీ భావజలధిలో మునిగితేలే దివ్యానుభూతిని ప్రసాదించిన తల్లీ నేను నీకు ఎంతో ఋణగ్రస్థురాలను తల్లీ ఏమి చేసి నీ ఋణము తీర్చుకోను.

ఏమో ఏమో తీర్చుకోను. మరి తియ్యని నీ ఋణమునకై నేను సదా ఋణగ్రస్థురాలినయ్యే వరాన్ని అనుగ్రహించు తల్లీ.

నీ ముద్దు మోమును చూస్తూ నీ ముద్దు మాటలతో అలా తియ్యగా నా జీవితమునే స్తంభింపచెయ్యి తల్లీ.

# కనక దుర్గకు వీరాధివీరమాలలు

ఎందరో అర్భకులు అనాధలు, దరిద్రులు, సాధు హృదయులు, సద్గుణసంప
న్నులు, అమృత హృదయులు భక్తులు, పేదలు నిరుపేదలు దుర్భర దారిద్ర
బాధలు సర్వ ఈతిబాధలు, పాపభీతిదైవ భీతి నశింపసాత్వికుల
వేదనల రోదనలు నిస్సహాయులై నీరసించి కృంగి కృశించి దుర్భలులై,
నవారి ఆర్తనాదఘోషలు వినిపించుట లేదా,

అమ్మా మహోగ్రశక్తి మహాశక్తివై కదలిరా
మాతృ హృదయ మమతలే ఉప్పొంగ ఈ అరాజక అవినీతి అశాంతి
అబద్ధాల బ్రతుకుల నుండి విముక్తి ప్రసాదించు విశ్వమాతా, నీవే
ఏకైక వీరాధి వీర జగన్ మాతా సర్వప్రపంచశ్యాంతికై నేనే సుగంధ
పరిమళ విజయమాలనై పోయెదరా కదలిరా,
చండ ప్రచండ చాముండీ, వీరశౌర్య శ్యామల, వీరవారాహీ, కపాలిని,
మహంకాళీ, సింహ వీరదుర్గా, వ్యాఘ్రి రాజరాజేశ్వరీ, గజవాహిని సంపత్మరీ,
భయంకర చారు సింహి భువనేశ్వరి, వీర కంకణి కామేశ్వరీ, మహావీర భద్రిణీ,
రౌద్రిణి, రుద్రిణీ, దాక్షాయణీ, పింగళాక్షి, విశ్వరూపాది అరుణ నేత్రిణుల,
కాళరాత్రి మహారాత్రి భద్రకాళిక పర్ధిని, నారాయణీ, శిఖండిని, త్రిపురఖండిని,
రక్త వర్ణ వీరశౌర్య బ్రాహ్మీవారీహి, మహేశ్వరీ, వాయుమనోవేగయుద్ధ శూర
నారీ రత్నాల పరివేష్ఠితా శ్రీదేవి దేవదేవి పరాదేవి, పరాశక్తి
చండప్రచండ మహోన్నకోపాజ్వాలా మహోన్నత ఉగ్రమహోగ్ర, వీరశౌర్య పరాక్రమ
ప్రతాపరణ రంగ ఏకైక ఈరిణి అమ్మా, రథగజహయ పతాక సింహ
వ్యాఘ్రా సమూహాశక్తులతో దుష్ట శిక్షణ ఆయుధ పూజ కాదమ్మా, ఆయుధాల
ధరించు, శంఖ, చక్ర, గదా, ఖడ్గ, ధనుర్భాణ, డాలు, కరవాల
త్రిశూల, పాశౌ అంకుశాలు, చాపము, కాలదండము, శక్త్రాస్త్రము, పాశుపతాస్త్రము,
కామేశాస్త్రములతో, భీకరఘంటా కొమ్ము బాలారాలతో, ముష్టి ఘాతముల,

**దుష్టుల శిక్షించి శిష్టు రక్షించి శాంతి**
**ప్రశాంతి సాధు జీవనులకు పరమీయవమ్మా**

**ఓం శాంతిః శాంతిః**

ఏకైక వీరాధి వీరిణి శౌర్యిణీ జగన్మాతా, జగద్రక్షకా,
జగదైక మాతా కదలిరా శ్యామలవారాహి శ్రీదేవివై సర్వరూపి
వైభువనాంతారాలే దద్దరిల్లగా సప్తసముద్రాలు భూమ్యాకాశాములే
ఏకం కాగా మహా ఏకైక వీరా సంరక్షింపుమ జగదైక సర్వేశ్వరీ
శరణం శరణం సరస్వశరణం, అభయం తవ అభయం

# దేవ్యపరాధస్తోత్ర క్షమాపణ రత్నమ్

న మంత్రం నో యంత్రం తదపి చ న జానే స్తుతి మహో
న చాహ్వానం ధ్యానం తదపి చ న జానే స్తుతి కథాః
న జానే ముద్రాస్తే తదపిచ న జానే విలపనం
పరం జానే మాతస్త్వదనుసరణం కష్టహరణమ్.
విధే రజ్ఞానేన ద్రవిణ విరహేణాలసతయా
విధేయా శక్యత్వాత్తవచ్చరణ యోర్యాచ్యుతి రభూత్
తదేతత్ క్షంతవ్యం జనని సకలోద్ధారిణి శివే
కుపుత్రో జాయేత్ క్వచిదపి కుమాతా న భవతి.
జగన్మాతర్మాత స్తవ చరణ సేవా న రచితా
న వా దత్తం దేపి ద్రవిణ మపి భూయస్తవ మయా
తథాపి త్వం స్నేహం మయి నిరుపమం యత్ప్రకురుషే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి.
పృథివ్యాం పుత్రాస్తే జనని బహవస్సంతి సరళాః
పరం తేషాం మధ్యే విరళతరళోహం తవ సుతః
మదీయో౽యం త్యాగః సముచితమిదం నో తవ శివే
కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి.
పరిత్యక్తా దేవా వివిధ పరసేవాకులత యా
మాయాపంచాశీతే రధిక మపనీతేతు వయసి
ఇదానీం నో మాత స్తవ యది కృపానాపి వయసి
నిరాలంబో లంబోదర జనని కం యామి శరణమ్.
శ్వపాకో జల్పాకో భవతి మధుపాకోప మగిరా
నిరాతంకో రంకో విహరతి చిరం కోటి కనకైః
తవాపర్ణే కర్ణే విశతి మనువర్ణే ఫలమిదం
జనః కో జానీతే జనని జపనీయం జపవిధౌ.
చితాభస్మా లేపో గరళమశనం దిక్పటధరో
జటాధారీ కంఠే భుజగపతిహారీ పశుపతిః
కపాలీ భూతేశో భజతి జగదీశైక పదవీం
భవాని త్వత్పాణి గ్రహణ పరిపాటీ ఫలమిదమ్.
నమోక్ష స్యాకాంక్షా భవవిభవ వాంఛాపి చనమే
న విజ్ఞానాపేక్షా శశిముఖి సుఖేచ్ఛాపి న పునః
అతస్త్వాం యాచేహం జనని జననం యాతుమమ వై

మృడానీ రుద్రాణీ శివ శివ భవానీతి జపతః
నారాధితాసి విధినా వివిధోపచారైః
కిం రూక్ష చింతన చర్యైర్నకృతం వచోభిః
శ్యామే త్వమేవ యది కించన మయ్యనాథే
ధత్సేకృపా ముచిత మంబ పరం తథైవ.
ఆపత్సుమగ్నః స్మరణం త్వదీయం
కరోమి దుర్గే కరుణార్ణవే శివే,
నైతచ్ఛఠత్వం మమభావ యేథాః
క్షుధాతృషార్తా జననీం స్మరంతి,
జగదంబ విచిత్ర మత్ర కిం
పరిపూర్ణా కరుణాస్తి చేన్మయి
అపరాధ పరంపరావృతం
నహి మాతా సముపేక్షతే సుతమ్.
మత్సమః పాతకీ నాస్తి
పాపఘ్నీ త్వత్సమా నహి
[illegible]
[illegible]
పాతయవా పాతాళే స్థాపయి వా సకలలోక సామ్రాజ్యే
మాతస్త్వచ్చరణయుగళం నాహం ముంచామి నైవముంచామి.

(ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచిత దేవ్యపరాధస్తోత్రరత్నం సంపూర్ణమ్)

# శ్రీ దేవి కాంచనమాలలు

1. శ్రీ లలితా మానసపుత్రి దుర్గాదేవి,
దుర్గా మానసపుత్రి శ్రీ మహాకాళి నాలుకను

భూమండలము పై రక్తపుచుక్కరానీక మహారౌద్రియై
దుర్గాదేవి సంహరించె రక్తబీజాసురుని,

దుర్గా మానసపుత్రి కౌశికి మహాతీవ్ర యుద్ధయే
చేసి శుంభ, నిశుంభుల సంహరించె,

ఇరువురి భస్మము నుండి మహిషాసురుడు
ఉద్భవించె, పలుబాధలు పెట్టసాగె సాధువుల,

దుర్గాదేవి మానసపుత్రి లీనమయైనది కౌశికి,
అటుపై మహావీర అఖండ
అప్రమేయ శక్తియై దుర్గాదేవియే
స్వయంబుగా మహిషునితో పోరుసల్పి
సంహరించె మహిషాసురుని శ్రీ మహాశక్తి దుర్గాదేవి,
దుర్ఘట కార్యసాధకి దుర్గాదేవికి మంగళం.

2). పంచమినాడు అమ్మ దుర్గాశక్తి అనంత బోధలు
షష్ఠినాడు కల్పారంభము, ఆమంత్రణము అధివాసము,
సప్తమినాడు, సప్తమీ పూజా సేవలు
అష్టమినాడు, అష్టకష్టముల నుండి రక్షించుతల్లికి పూజ
నవమినాడు, మహారౌద్రిణియై కాపాడు తల్లికి నవమిపూజ
విజయదశమినాడు, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేసి సాధుజనుల
రక్షించిన తల్లికి విజయోత్సవాలు
నవరత్నాల నవనీత హృదయిని, ప్రేమైకమూర్తికి
నవరాత్రి సంబరాల సంతోషమున చేసేము నీకు దుర్గాదేవి ॥

3). ఓం జయదేవి చాముండీ జయ భూతాపహారిణి,
జయ సర్వవ్యాప్తి దేవి కాళరాత్రి నమోస్తుతే,
జయము నీకు కాళి భద్రకాళి కపాలిని,
దుర్గాదేవి, శివసతి, భూదేవివలె క్షమాదేవి,
అమ్మా నీవే సర్వము నిఖిలజగత్తు నీ శక్తియే,
మధుకైటభుల సంహారి జయము, నీయశస్సుకు,
నీరూపమే మోహనం జయశుభప్రదం దేవి,
మహిషాసుర సంహారి, మహోన్నత శక్తి స్వరూపి,దేవిదుర్గా నమో నమః,
ధూమ్రరూపి కౌశికి శుంభ, నిశుంభుల సంహారిణి దేవిదుర్గా
జయము విజయము శౌర్య మంగళం ॥

4). దేవి చండముండాసుర సంహారిణి,

చాముండీదేవి దుర్గా జయము,

సర్వసౌభాగ్యప్రదాయి, శుభమంగళరూపా,

శత్రునాశని, చింతల తీర్చు దేవిదుర్గా

సర్వకాలముల భక్తుల రక్షించు అపర్ణ

రక్షణ భారము వహించు దేవిదుర్గా,

పూర్వజన్మ పాపఫల అనేక పాపముల వ్యాధుల

దగ్ధము చేసే చండికే దేవిదుర్గా,

పాపనాశని జయ విజయకారిణి చండికా దేవి దుర్గా,

సౌభాగ్య ఆరోగ్య శుభాలనిచ్చే తల్లి దేవి దుర్గా,

సర్వమానవాళికి సౌభాగ్య, ఆరోగ్య సుఖసంతోష ప్రదాయి దేవిదుర్గా,

సర్వదా నీకే విధేయులమై నీ దీవెనలో నీ దయలో నుండి పోనీ దేవిదుర్గా

ధనవంతులకు ఊడిగము లేల చేయవలెనమ్మ

ఇంతటి శక్తివి నీవుండ దేవిదుర్గా,

నిరుపేదల ధనవంతుల దుష్టుల శిష్టుల సర్వులకు నీవే

కొండంత అండవై మహాదుర్గమా దేవిదుర్గా ॥

5). అమ్మా సర్వదుర్మార్గ శిక్షిణి, బలహీనుల రక్షింప

సదా కాపాడు తల్లిరో దేవి దుర్గా,

రాక్షస సంహారము చేసి దేవతలచే పూజింపబడు తల్లిరో దేవి దుర్గా,

అమ్మా వినయ విద్యల, అష్ట సంపదల నిచ్చు తల్లి

దుర్భరులకు బలవంతులకు దిక్కు నీవే దేవి దుర్గా,

అమ్మా గర్వముతో అతి మదాంధులై, కన్నుమిన్ను

గానని కండకావరము పేదల అమాయకుల బాధించు

తీవ్ర గర్వాంధుల మదమణంచు తల్లి కాపాడు

బలహీనుల పేదల దౌర్భాగ్య జీవనాల దేవి దుర్గా,

ప్రచండదర్ప తపో రాక్షస సంహారిణి మానవులలో

అహం గర్వంబుల దగ్ధము చేయు దేవి దుర్గా,

సర్వుల ధన, కనక, వస్తువాహన, సంతోష,

వైవాహిక జీవనములనిచ్చు దేవి దుర్గా॥

6). చతుర్భుజవై నవమోహినివై

నగుమోముతో ప్రేమ నిండిన నయనాలతో,

నీ భక్తుల చల్లగా కాపాడు

అభయ హస్తమైన అమృత వరపాణి,

సువిశాల నయనాల రెప్పపాటే లేక,

దయతో నీ భక్తుల కాచేటి సువిశాలనేత్రి,

చల్లని నీ ఒడిలో మా కష్టాలే కడతేరిపోవు

సర్వ బిడ్డల ఒడిచేర్చి లాలించు ఓంకారేశ్వరి,

చల్లని సంసారం సుఖసంతోష జీవన ప్రదా,

శుభపరం పరల నిచ్చు పరదేవతా,

చల్లగా కాపురం సాగించి సంసార సముద్రము

దాటించు ప్రేమా మృతమయీ అమృతవర్షిణి,

చల్లగా సహస్ర బాహువుల, మహాశక్తివై

సర్వ లోకాల సంరక్షించు సర్వేశ్వరి,

చల్లని తీయని నీ అనురాగములో నవనీత

హృదయనీవే రక్ష నీవే శరణం భవతరణం దేవి దుర్గా॥

7). అమ్మా దుర్గాదేవి మూల ప్రకృతి, రక్షాశక్తి,

శాశ్వత పసుపుకుంకుమల గౌరిదేవి,

శుభస్వరూపిణి భాగ్యదేవత శివసతి

కృష్ణవర్ణా దేవి దుర్గా,

అనంత విజయ అభయ జయ మంగళరూపి,

సాధురూప, దుర్మార్గులపై రౌద్ర స్వరూపాదేవి,

సర్వ జగాలలోను విష్ణు మాయవై

సర్వులలో తెలివి నీవైన దేవి,

నీవేనిద్రా, ఆకలి, రూపిణివైన తల్లీ దేవి,
నీ భక్తులలో నీవే ఛాయారూపదేవి,
సర్వ భక్తులలో ధైర్య శక్తివైన తల్లివై నిన్నే
గాంచాలనే దప్పిక నీవే దేవి
సర్వుల యందు సర్వ భక్తుల యందు వశించు దేవిదుర్గా

8). అమ్మా 'సర్వలోకాల' రక్షించే తల్లి,
ఓర్పుకు రూపం నీవే అయిన దేవి,
జాతిమత బేధాల సంహరించు వారి
శిక్షించు సర్వజాతి స్వరూపిదేవి,
గర్వముతో పదవులతో నాశనము చేయువారిని,
వినమ్రతవై సర్వులలో నుండుదేవి,
మహాకల్లోలములను కలహాల కల్పించువారిని,
శాంతి రూపివై సర్వులలో నుండు దేవి,
అశ్రద్ధతో ప్రాణాలు తీసి మానవ అవయవాలతో
వ్యాపారమే చేయువారిని వారిప్రాణముల తీపి,
తెలిపి శాంతి కాముకులై శ్రద్ధా భక్తులుగా చేయు
కాంతివై మహా భాగ్యమువై వృత్తి బాధ్యతల
ధర్మ మార్గాన నడిపించు తృప్తి, దయారూపులుగా
తీర్చి దిద్దుతల్లి మా పొరపాట్లకు పొర్లుదండాలు తల్లీ,
మహావీరశౌర్య ప్రతాపిణివై మహాధైర్య సాహస
యుద్ధ స్వరూపిణి దేవి దుర్గా ॥



సమాప్తం